# జ్ఞానశక్తి

## మహాకాళి (రెండవ భాగము)







# శ్రీ మాతా శ్రీ మహారాజ్ఞీ శ్రీ మత్సింహాసనేశ్వరీ

## శ్రీ లలితా సహస్ర నామావళి వ్యాఖ్యానము

(అత్యంత సులభశైలిలో)

మూడు భాగములలో

**వేయి నామముల వ్యాఖ్యానము, వేయి నూట పదహారు చిత్రములు, మహాస్తోత్రనిధి**

(రెండు భాగములు పూర్తి రంగులలో)

పసుమర్తి వేంకట దుర్గా సుబ్రహ్మణ్యం

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రేనమః

# శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరి

శ్రీలలితా సహస్ర నామావళి వ్యాఖ్యానము

(అత్యంత సులభశైలిలో)

# జ్ఞానశక్తి

(రెండవ భాగము)

వేయి (ఈ భాగములో 500) నామములకు వ్యాఖ్యానము

అమ్మవారి వేయి (ఈ భాగములో 500) నామములకు

(మొత్తం 1116) వర్ణ చిత్రములు

గ్రంథకర్త:

పసుమర్తి వేంకట దుర్గా సుబ్రహ్మణ్యం



శ్రీలలితా మహాత్రిపురసుందరీ ధ్యానపీఠము

గంగాపూర్, ముండరిగి తాలూకా

గదగ్ జిల్లా, కర్ణాటక - 582118

7702090319

# శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ

ప్రథమ ముద్రణ:

**2023**

ప్రతులు : **1200**



**రచన, డి.టి.పి మరియు కలర్ గ్రాఫిక్స్: గ్రంథకర్త (పసుమర్తి వేంకట దుర్గా సుబ్రహ్మణ్యం)**

ప్రాప్తిస్థానము:

శ్రీలలితా మహాత్రిపురసుందరీ ధ్యానపీఠము

గంగాపూర్, ముండరిగి తాలూకా

గదగ్ జిల్లా, కర్ణాటక - 582118

7702090319, 9505813235





## మాతా పితరులకు వందనం

జన్మనిచ్చి. భూమిమీద పడిన తరువాత అడుగు శరీరం నుండి ఆరడుగుల శరీరం పెరిగే వరకూ పోషించి, విద్యాబుద్ధులు నేర్పించి నన్ను ప్రయోజకుడిని చేసిన అమ్మానాన్నలకు మనస్ఫూర్తిగా అంకితమిస్తున్నాను.

ఎనిమిది నెలలు(1977లో) తన పాదసేవాభాగ్యంతో నన్ను పునీతుని జేసిన జిల్లెళ్ళమూడి అమ్మ నాకు సాక్షాత్తు పరమేశ్వరీ స్వరూపము. ఆ పరాత్పరికి పాదాభివందనములు చేయుచున్నాను.

ఆ తల్లి నామ మంత్రం:-

## జయహో మాతా శ్రీఅనసూయా

## రాజరాజేశ్వరి శ్రీపరాత్పరి



# గురువందనం

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**

**గురు స్సాక్షాత్పర బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః**

మహాగణపతి, బాలాత్రిపురసుందరి, శక్తిపంచాక్షరీ, పంచదశీ మంత్రోపదేశము, ప్రసాదించినవారు, నా రచనా ప్రవృత్తికి మార్గదర్శకులైన వారు, కుర్తాళం మౌనస్వామి వారి ప్రియశిష్యులు, నాతొలి గురువర్యులు అయిన కీ.శే కొండాకోటయ్య మహనీయులకు ఈ గ్రంథమును మనస్ఫూర్తిగాఅంకితము చేస్తున్నాను.



# గురువందనం

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**

**గురు స్సాక్షాత్పర బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః**

ఆంగ్లభాషలో అనర్గళ వాక్పటిమను ప్రసాదించినవారు, నా జీవన వృత్తికి మార్గదర్శకులైన వారు, శ్రీకుర్తాళం మౌనస్వామి వారి ప్రియశిష్యులు, నా తొలి గురువర్యులు అయిన కీ.శే శ్రీకొండాకోటయ్య మహనీయుల కుమారులు కీ.శే శ్రీ కొండారామనాథ రావు గారికి ఈ గ్రంథమును మనస్ఫూర్తిగా అంకితము చేస్తున్నాను.

# జ్ఞానశక్తి (రెండవ భాగం) లో

శ్రీలలితా సహస్రనామ వ్యాఖ్యానము (అమ్మవారి చిత్రములతో)


| | | |
|---|---|---|
| 1. | ఆరవ వందనామముల వ్యాఖ్యానముల ప్రారంభము | 1 |
| 2. | ఏడవ వందనామముల వ్యాఖ్యానముల ప్రారంభము | 206 |
| 3. | ఎనిమిదవ వందనామముల వ్యాఖ్యానముల ప్రారంభము | 397 |
| 4. | తొమ్మిదవ వందనామముల వ్యాఖ్యానముల ప్రారంభము | 568 |
| 5. | పదియవ వందనామముల వ్యాఖ్యానముల ప్రారంభము | 732 |
| 6. | శ్రీలలితా సహస్రనామస్తోత్రము తృతీయోధ్యాయము (ఫలశ్రుతి) (శ్రీలలితా సహస్రనామస్తోత్ర పారాయణ మహాత్మ్యము) | 892 |


శ్రీచక్రమేరు ప్రస్తారముల చిత్రములు


| | | |
|---|---|---|
| 9. | శ్రీచక్రమేరు ప్రస్తారము (కైలాస ప్రస్తారము) | 205 |
| 10. | శ్రీచక్రమేరు ప్రస్తారము (కూర్మ ప్రస్తారము) | 396 |
| 11. | శ్రీచక్రమేరు ప్రస్తారము (మహాకామేశ్వరము) | 567 |
| 12. | తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి గారు | 731 |
| 13. | భాస్కరరాయలు వారు | 891 |



ఓం ఐం హ్రీం శ్రీం 0501

గుడాన్న ప్రీత మానసాయై నమః






ఓం ఐం హ్రీం శ్రీం

సమస్తభక్త సుఖదాయై నమః

0502

# 501వ నామ మంత్రము

## ఓం గుడాన్నప్రీత మానసాయై నమః

బెల్లంతోగూడిన యన్నమనిన ఎంతో మనసుపడే లాకినీస్వరూపిణియైన పరమేశ్వరికి నమస్కారము.

శ్రీలలితా సహస్ర నామావళి యందలి **గుడాన్నప్రీత మానసా** యను ఎనిమిదక్షరముల (అష్టాక్షరీ) నామ మంత్రమును **ఓం గుడాన్నప్రీత మానసాయై నమః** అని ఉచ్చరించుచూ, ఆ లాకినీస్వరూపిణియైన పరమేశ్వరిని ఉపాసించు సాధకులు శాంతిసౌఖ్యములతోను, సకలశుభములతోను విలసిల్లుచూ, పరమేశ్వరియందు అచంచలమైన భక్తిప్రపత్తులతో జీవించి తరించుదురు.

లాకినీదేవీ స్వరూపిణియైన పరమేశ్వరికి గుడాన్నము (బెల్లముతోగూడిన అన్నము) అనిన ప్రీతి. చక్కెరపొంగలినికూడా గుడాన్నమందురు. బెల్లము శరీరానికి పుష్టినిస్తుంది. పరమేశ్వరిని ఆరాధనచేసి, గుడాన్నమును నివేదనచేసి, ఆ ప్రసాదమును ఆరగించు భక్తులు శరీరపుష్టితో గలిగియుందురు. ఒక్కొక్క దేవతాస్వరూపిణియైన పరమేశ్వరిని ఆరాధిస్తూ, ఆ దేవతకు ఇష్టమైన వివిధ రకములైన అన్నములు (నెయ్యితో గలిపినది, పాయసాన్నము, గుడాన్నము, చిత్రాన్నము, పప్పు అన్నము, పెరుగు అన్నము) నివేదించి, భక్తిగా ఆ ప్రసాదమును ఆరగించుట వలన ధాతుపుష్టిని పొందుదురను ఆంతర్యము ఇదియే. ఇక్కడ లాకినీస్వరూపిణియైన దేవతకు గుడాన్నమనిన ఇష్టము అని చెప్పుటకు ఆ దేవత మాంసధాతువుకు అధిదేవతయగుటయే కారణమని భావించవచ్చును. లలితా సహస్ర నామావళి యందలి ప్రతీ నామము ఒకమంత్రమై, ఆ నామ మంత్రమునకు ఒక పారమార్థిక భావన ఉన్నదనుటలో సందేహములేదు. లాకినీస్వరూపిణియైన పరమేశ్వరికి నమస్కరించునపుడు **ఓం గుడాన్నప్రీత మానసాయై నమః** అని యనవలెను.

# 502వ నామ మంత్రము

## ఓం సమస్తభక్త సుఖదాయై నమః

తనను అత్యంత భక్తిప్రపత్తులతో సేవించు భక్తులందరి కోర్కెలనూ సిద్ధింపజేసి సకల సుఖములను ప్రసాదించు లాకినీదేవీ స్వరూపిణియైన జగన్మాతకు నమస్కారము.

శ్రీలలితా సహస్ర నామావళి యందలి **సమస్తభక్త సుఖదా** యను ఎనిమిదక్షరముల (అష్టాక్షరీ) నామ మంత్రమును **ఓం సమస్తభక్త సుఖదాయై నమః** అని ఉచ్చరించుచూ, ఆ లాకినీస్వరూపిణియైన జగన్మాతను అత్యంతభక్తిశ్రద్ధలతో ఆరాధించు సాధకులు ఇహపరసౌఖ్యములకు లోటులేకుండా జీవించి తరించుదురు.

మణిపూరాబ్జమునందు విలసిల్లు లాకినీదేవతా స్వరూపిణియైన పరమేశ్వరి తనను అత్యంత భక్తిశ్రద్ధలతో సేవించు భక్తులకు శాంతిసౌఖ్యములు, సకలసంపదలు, కీర్తిప్రతిష్ఠలను ప్రసాదించును. భక్తులయొక్క ధర్మబద్ధమైన కోరికలను సిద్ధింపజేయుటయేగాక, కైవల్యపదమును పొందుటకు కావలసిన సాధనాపటిమను కలుగజేయును.

లాకినీదేవి మాంసధాతువునందు ఉంటుంది గనుక తనను సేవించు భక్తులకు శరీరమునందు మాంసపుష్టిని అనుగ్రహించి శక్తిమంతులుగా విలసిల్లజేయును. భగవదారాధనకు కావలసినది ధ్యాననిమగ్నత, భక్తిప్రపత్తులేగాదు. దీక్షాబద్ధులై ఆహారపానీయములను సైతము లెక్కచేయకుండా సాధనచేయుటకు శరీరములో శక్తిసంపదలుకూడా పుష్కలంగా అవసరం. మానావమానముల యందు, నిందాస్తుతుల యందు, సుఖదుఃఖముల యందు, శత్రు మిత్రాదులందు, మృణ్మయ కాంచనముల యందు గుణాతీతులు కావలెనన్నచో భక్తులకు నిరంతర సాధనకావలెను. అట్టి భక్తులు నిరంతరము ఆత్మస్థితియందు మాత్రమే నిలకడ కలిగియుండుటనే నిజమైన సుఖము అని అన్నారు. అంతటి మహోన్నతమైన సుఖమును పొందిన భక్తులను మిథ్యారూప ప్రపంచమునందలి ఇట్టి ద్వంద్వములు వారినేమియు చేయజాలవు. ఇట్టి మహోన్నత స్థితిపొందుటయే సుఖము అని అన్నారు గనుక అట్టి సుఖమునకై ప్రయత్నించి కృతార్థత బడయవలెనన్న సాధనాపటిమ ఎంతైనను అవసరము. అటువంటి సాధనా పటిమను లాకినీ స్వరూపిణియైన పరమేశ్వరి తన భక్తులకు అనుగ్రహించును. అచంచల భక్తితో తనను సేవించు భక్తులు త్రిగుణములను దాటి బ్రహ్మ సాక్షాత్కారమును పొందునటు వంటి అసలైన సుఖమును అనుగ్రహించు లాకినీ స్వరూపిణియైన పరమేశ్వరికి నమస్కరించునపుడు **ఓం సమస్తభక్తసుఖదాయై నమః** అని యనవలెను.




ఓం ఐం హ్రీం శ్రీం 0503

లాకిన్యంబా స్వరూపిణ్యై నమః

# 503వ నామ మంత్రము

## ఓం లాకిన్యంబా స్వరూపిణ్యై నమః

మణిపూరచక్రాధిష్ఠానదేవతయైన లాకినీదేవీ స్వరూపంలో తేజరిల్లు పరమేశ్వరికి నమస్కారము.

శ్రీలలితా సహస్ర నామావళి యందలి **లాకిన్యంబా స్వరూపిణీ** యను ఎనిమిదక్షరముల (అష్టాక్షరీ) నామ మంత్రమును **ఓం లాకిన్యంబా స్వరూపిణ్యై నమః** అని ఉచ్చరించుచూ, ఆ లాకినీదేవీ స్వరూపిణియైన పరమేశ్వరిని అత్యంత భక్తిశ్రద్ధలతో ఆరాధించు భక్తులకు ఆ తల్లి భౌతికపరముగా సమస్త శాంతిసౌఖ్యములనూ ప్రసాదించుటయేగాక, ఆముష్మికపరమైన స్థితిని పొందుటకు కావలసిన దీక్షాసంపదనుకూడా ప్రసాదించును.

మణిపూరచక్రాధిష్ఠాన యోగినీశక్తి **వయోఽవస్థావివర్జిత** యను నామము గలిగిన దేవత. ఈ దేవతయొక్క మంత్రమునకు బీజము, శక్తి, కీలకములు **ల** కార సంకేతములు గనుక, ఈ తల్లి **లాకిన్యంబా** యని అనబడినది. శ్రీమాత చతుష్షష్టికోటి యోగినీ గణములచే సేవింపబడు చుండుటయే గాక, చతుష్షష్టికోటి యోగినీ దేవతల స్వరూపిణిగా అలరారుచున్నది. అంతేకాదు ఆ పరమేశ్వరి సకలదేవతా స్వరూపిణి కూడా! గనుకనే ఇక్కడ అమ్మవారిని **లాకిన్యంబాస్వరూపిణీ** యని భక్తిప్రపత్తులతో కీర్తిస్తున్నాము.

నాభిస్థానమునందు గల మణిపూరాబ్జమునకు పదిదళములు ఉన్నవి. పదిదళములందు **డ** నుండి **ఫ** అను పది బీజాక్షరములు గలవు. ఆయా బీజాక్షరములే తమ నామములకు ప్రారంభాక్షరములుగా గల పదిమంది యోగినీశక్తులు పరివేష్టించి ఉండగా, మధ్యగల మణిపూరాబ్జకర్ణికయందు లాకినీదేవి కొలువుతీరియున్నది. శ్రీమాత సాక్షాత్తు ఆ లాకినీదేవీ స్వరూపిణి గనుక, ఆ పరమేశ్వరి **లాకిన్యంబాస్వరూపిణి** యని అనబడినది. లాకినీదేవికి మూడు ముఖములు (శిరస్సులు), కోరలు గలవు. మూడు చేతులలో వజ్రము, శక్తి, దండము గలిగి, నాలుగవ చేతితో అభయ ముద్రతో ఈ లాకినీదేవి విరాజిల్లుచున్నది. ఈ దేవత మాంసధాతువునందు ఉన్నది. ఈమెకు బెల్లముతోగూడిన అన్నము అనిన ప్రీతి. లాకినీదేవి తన భక్తులకు సమస్త సుఖములను ప్రసాదించును. లాకినీదేవికి సంబంధించిన ఈ విశేషణములు అన్నియును లలితా సహస్ర నామావళి యందు **మణిపూరాబ్జనిలయా** యను (495వ) నామ మంత్రము నుండి **సమస్తభక్తసుఖదా** యను (502వ) నామ వరకునూ గల నామ మంత్రములలో చెప్పబడినది. శ్రీమాత లాకిన్యంబా స్వరూపిణి గనుక ఈ విశేషణములు అన్నియును ఆ తల్లికే సమన్వయింపబడి, ఆ తల్లినే ఆ నామములతో కీర్తించుచున్నాము. ఈ సందర్భంలో శంకర భగవత్పాదుల వారు తమ సౌందర్యలహరిలో నలుబదియవ (40వ) శ్లోకంలో ప్రస్తుతించారు.

***తటిత్వంతం శక్త్యా - తిమిరపరిపంథి స్ఫురణయా***
***స్ఫురన్నానారత్నాభరణ -పరిణద్ధేంద్ర ధనుషమ్***
***తవ శ్యామం మేఘం - కమపి మణిపూరైక శరణం***
***నిషేవే వర్షంతం-హరమిహిరతప్తం త్రిభువనమ్ ॥***

మణిపూరక చక్రము నందుండి ముల్లోకములను తడుపు నీలమేఘమునకు ధ్యానము. ఈ శ్లోకములో సూచింపబడిన శివశివాణి రూపములు – మేఘేశ్వరుడు, సౌదామిని. పరమేశ్వరీ! జలతత్వమైన మణిపూరక చక్రాన్ని గృహముగా చేసుకుని అచట ఉండు చీకట్లను పోగొట్టుటకు, అంధకారమును నిర్మూలము చేయు విద్యుత్ కాంతి శక్తి కలిగిన మెరుపుతో కూడిన ప్రకాశంతో వెలుగొందుతూ, అనేక రత్నాలు పొదగబడిన, నగలచేత కూర్చబడిన ఇంద్రధనుస్సు కలిగి, నీలవర్ణ ఛాయతో ప్రకాశిస్తూ సూర్యుని ప్రచండాగ్నిచే కాల్చబడిన ముల్లోకములను తన వర్షధారలచే తడుపుతూ మాటలతో చెప్పనలవి కానంత శ్రేష్ఠముగా అలరారుతున్న ఆ మేఘమును అనగా ఆ సదాశివుని (మేఘము అనగా అమృతేశ్వరాఖ్య దంపతీయుగ్మంగా కూడా అర్థం కలదు.అందువలన అమ్మను, అయ్యవారిని అనికూడా భావింపవచ్చును) భక్తితో సేవించుచున్నాను.

ఇక్కడ మెరుపు అమ్మవారు, మేఘం అయ్యవారైన పరమేశ్వరుడు. మెరుపు మరియు మేఘము కలసి సాంబశివులుగా వెలుగొందుచున్నారు. మణిపూరకచక్రమందు శోభిల్లు వీరిని మేఘేశ్వర, సౌధామినిలుగా అమృతేశ్వర, అమృతేశ్వరిలుగా ఉపాసించుట కూడా గలదు.

ఆ తల్లిని ఇలా ధ్యానిస్తున్నాము:– అమ్మా! జగన్మాతా! మణిపూరచక్రమే ముఖ్యస్థానంగా గలిగినదానవై, ప్రళయకాల రుద్రుడనే సూర్యుడిచే (దుఃఖం) తపింపచేయబడిన ఈ ముల్లోకాలను ( కృపామృత) వర్షధారలచే తడుపుతూ, మెరపు తీగలతో కూడి అంధకారాన్ని (అజ్ఞాన) రూపుమాపుతూ, రత్నాలచేత నిర్మించబడిన ఆభరణాల కాంతిచే ఏర్పడిన ఇంద్రధనస్సుతో (జ్ఞానదీప్తితో) కూడిన, అనిర్వచనీయమైన, శివశక్త్యాత్మకమైన నీ నీలిమేఘాన్ని (దయాస్వరూపం) నేను ఆరాధిస్తున్నాను. లాకినీస్వరూపిణియైన పరమేశ్వరికి నమస్కరించునపుడు **ఓం లాకిన్యంబాస్వరూపిణ్యై నమః** అని యనవలెను.

స్వాధిష్ఠానం
దేవత కాకినీదేవి
(సిద్ధేశ్వరీ దేవి)

స్వాధిష్ఠానం బీజాక్షరాలు
బం, భం, మం, యం,
రం, లం

బం

లం

భం

రం

మం

స్వాధిష్ఠానం
ఆరు దళముల పద్మం

స్వాధిష్ఠానం
అధిపతి బ్రహ్మ

స్వాధిష్ఠానం
తత్త్వం ఆగ్ని

స్వాధిష్ఠానం
బీజాక్షర మంత్రం వం

## స్వాధిష్ఠాన చక్రం



**ఓం ఐం హ్రీం శ్రీం** **0504**

**స్వాధిష్ఠానాంబుజగతాయై నమః**






బం

లం భం

రం మం

యం






ఓం ఐం హ్రీం శ్రీం 0505

చతుర్వక్త్ర మనోహరాయై నమః



# 504వ నామ మంత్రము

## ఓం స్వాధిష్ఠానాంబుజగతాయై నమః

స్వాధిష్ఠానచక్రము నందు కాకినీ యను దేవతాస్వరూపిణియై భాసిల్లు పరమేశ్వరికి నమస్కారము.

శ్రీలలితా సహస్ర నామావళి యందలి **స్వాధిష్ఠానాంబుజగతా** యను ఎనిమిదక్షరముల (అష్టాక్షరీ) నామ మంత్రమును **ఓం స్వాధిష్ఠానాంబుజగతాయై నమః** అని ఉచ్చరించుచూ, అత్యంత భక్తిశ్రద్ధలతో ఆ కాకినీదేవీ స్వరూపిణియైన పరమేశ్వరిని అత్యంత భక్తిప్రపత్తులతో ఆరాధించు సాధకులు ఆ తల్లి కరుణచే అంతులేని ఆత్మానందానుభూతిని పొందుదురు.

మూలాధారమునకు పైన, మణిపూరమునకు క్రిందనూ స్వాధిష్ఠానచక్రము గలదు. ఇది జననేంద్రియం వెనుక భాగాన, వెన్నుముకలో ఉంటుంది. అధినేత బ్రహ్మ, తత్వం జలం. సిందూరవర్ణంలో ఉంటుంది, దీనినే స్వాధిష్ఠానాంబుజము లేదా స్వాధిష్ఠాన పద్మము అందురు. ఈ పద్మమునకు ఆరు దళములు గలవు. ఈ ఆరుదళములందును **బ, భ, మ, య, ర, ల** అను బీజాక్షరములు, **ఆ** బీజాక్షరములే తమ నామములకు ప్రారంభముగా గలిగిన యోగినీ దేవతలు వున్నారు. స్వాధిష్ఠానాబ్జమునకు గల మధ్యగల కర్ణికలో కాకినీదేవి కొలువుదీరి ఉండును. ఆ కాకినీదేవిని ఈ విధముగా ధ్యానముచేయుట గలదు ఆరుదళముల స్వాధిష్ఠాన పద్మమందు నాలుగు ముఖములు గలిగి, మూడునేత్రములతోను, నాలుగు చేతులతోను, నాలుగు చేతులందు త్రిశూలము, పాశము, కపాలము, అభయముద్రలతోను అలరారుతూ, గర్వము గలిగినదియు, మేదస్సు అను ధాతువు నందుండునదియు, మద్యపాన మదముచే సంతోషించునదియు, బందిన్యాది దేవతలచే పరివేష్టింపబడినదియు, పచ్చని, ఎర్రని వర్ణములతో శోభిల్లునదియు, పెరుగన్నము నందు ప్రీతిగలిగినదియు, ఇష్టకామ్యములను సిద్ధింపజేయునదియు అయిన కాకినీదేవిని ధ్యానించు చున్నాను స్వాధిష్ఠాన పద్మమందు వశించు కాకినీ దేవీ స్వరూపిణి యైన పరమేశ్వరి స్వాధిష్ఠానాంబుజగతా యని అనబడినది. స్వాధిష్ఠానాంబుజమునందు విలసిల్లు కాకినీదేవీ స్వరూపిణియైన పరమేశ్వరికి నమస్కరించునపుడు **ఓం స్వాధిష్ఠానాంబుజగతాయై నమః** అని యనవలెను.

# 505వ నామ మంత్రము

## ఓం చతుర్వక్త్ర మనోహరాయై నమః

నాలుగు ముఖములతో (శిరస్సులతో) మనోహరముగా భాసిల్లు కాకినీదేవీ స్వరూపిణియైన పరమేశ్వరికి నమస్కారము.

శ్రీలలితా సహస్ర నామావళి యందలి **చతుర్వక్త్ర మనోహరా** యను ఎనిమిదక్షరముల (అష్టాక్షరీ) నామ మంత్రమును **ఓం చతుర్వక్త్ర మనోహరాయై నమః** అని ఉచ్చరించుచూ, అత్యంత భక్తిశ్రద్ధలతో ఆ కాకినీ స్వరూపిణియైన పరమేశ్వరిని ఆరాధించు సాధకులకు ఎనలేని పరమేశ్వరీ ధ్యాన నిరతితోబాటు, సాధనయందు అకుంఠిత దీక్ష, నిశ్చలమైన జ్ఞానసంపద, శాంతిసౌఖ్యములు ఆ తల్లి కరుణచే సంప్రాప్తించును.

విశుద్ధచక్రాధిష్ఠాన దేవతయైన డాకినీ దేవి వదనైకసమన్విత (ఒక శిరస్సుగలిగి యుండును), అనాహతచక్రాధిష్ఠానదేవతయైన రాకినీ యోగిని వదనద్వయ (రెండు శిరస్సులు గలిగియుండును), మణిపూర చక్రాధిష్ఠానదేవతయైన లాకినీ దేవి వదనత్రయ సంయుత (మూడు శిరస్సులు గలిగియుండును), స్వాధిష్ఠాన చక్రాధిష్ఠాన దేవతయైన కాకినీ దేవి చతుర్వక్త్ర మనోహర (నాలుగు శిరస్సులు గలిగియుండును). కాకినీదేవియొక్క నాలుగు శిరస్సులు నాలుగు వేదములుగా భావించవచ్చును.

కాకినీ దేవియొక్క నాలుగు ముఖములు వేదములందు చెప్పిన బ్రహ్మక్షత్రియవైశ్యశూద్ర యను చతుర్వర్ణములకు సంకేతములుగా భావించవచ్చును. కాకినీదేవి నాలుగు శిరస్సులు ధర్మార్థకామమోక్షములనెడు చతుర్విధపురుషార్థములుగా భావించవచ్చును. నాలుగు ముఖములతో మనోహరముగా ఉన్న కాకినీ దేవీ స్వరూపిణి యైన పరమేశ్వరికి నమస్కరించునపుడు **ఓం చతుర్వక్త్రమనోహరాయై నమః** అని యనవలెను.




0506

**ఓం ఐం హ్రీం శ్రీం**

**శూలాద్యాయుధ సంపన్నాయై నమః**




0507

**ఓం ఐం హ్రీం శ్రీం**
**పీతవర్ణాయై నమః**

# శ్రీ చక్ర యంత్రరాజము

## కాశ్మీరీ హైందవము ఆధారితమైన తంత్రములో పవిత్రమైన యంత్రం



దీని జ్యామితీయ నిర్మాణము ఒక బిందువు చుట్టూ వివిధ దిశలలో ఉద్భవించే పెద్ద త్రిభుజాల వలె ఉంటుంది. ఈ యంత్రము శక్తి స్వరూపిణులైన శ్రీ విద్య, లలితా దేవి లేదా త్రిపుర సుందరి అనే దేవతను సూచిస్తాయి. దీనిలోని నాలుగు సమద్విబాహు త్రిభుజాలు ఊర్ధ్వముఖంగా ఉండి శివుణ్ణి లేదా పురుష శక్తిని సూచిస్తాయి. అయిదు సమద్విబాహు త్రిభుజాలు నిమ్నముఖంగా ఉండి శక్తిని లేదా స్త్రీని సూచిస్తాయి. కావున శ్రీ చక్ర యంత్రము వ్యతిరేక దివ్యశక్తుల సంగమమును సూచిస్తుంది. ఇందులో త్రిభుజాలు మొత్తం తొమ్మిది ఉన్నందున దీనిని నవయోని చక్రం అని లేదా నవ చక్రం (Nava Chakras) అని కూడా పిలుస్తారు.